(శు)భమస్తు.

# హరికథేతిహాసమంజరి



రెండవ భాగము.

ఇయ్యది

విశాఖపట్టణముజిల్లా, అనకాపల్లి వాసుడగు

## బీ. బాలాజీదాసునిచే

వ్రాయబడినది.

ప్రకటనకర్త.

## బీ. అమ్మన్న




బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు

డి. కే. పంత్ చే

ముద్రింపబడియె.

ఆరవ కూర్పు: 1,000 ప్రతులు.

*Reprint.*

**1922.**



**Price Re. 0-6-0.** వెల రూ 0-6-0.

భమస్తు.

# హరికథేతిహాసమంజరి



రెండవ భాగము.

ఇయ్యది

విశాఖపట్టణముజిల్లా, అనకాపల్లి వాసుఁడగు

బి. బాలాజీదాసునిచే

వ్రాయబడినది.

ప్రకటనకర్త.

బి. అమ్మన్న

బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు

డి. కే. పంత్ చే

ముద్రింపబడియె.

ఆరవ కూర్పు : 1,000 ప్రతులు.

*Reprint.*

**1922.**






**Price Re. 0-6-0.** వెల రూ 0-6-0.

శ్రీ శుభమస్తు.

# హరికథేతిహాసమంజరి

రెండవభాగము.

ఇయ్యది
విశాఖపట్టణజిల్లా, అనకాపల్లి వాసుండగు

## బి. బాలాజీదాసునిచే

వ్రాయబడినది.

ప్రకటనకర్త.
బి. అమ్మన్న.

బెజవాడ వాణీముద్రాక్షరశాలయందు
డి. కే. పంత్ చే
ముద్రింపబడియె.

ఆరవ కూర్పు : 1,000 ప్రతులు.

*Reprint.*

1922.



Price Re. 0-6-0. వెల రూ 0-6-0.

# పీఠిక

[illegible]లారా !

పలుచోటుల హరికథామధ్యంబున సామాన్యుల చిత్తములు రంజిల్లునటుల పిట్టి [illegible] కీర్తనలం బాడుచుండ వాటిని వ్రాసియిమ్మని పెక్కండ్రు బాధింపగా [illegible]ంచితి.

విధేయుఁడు,

అనకాపల్లి. బీ. బాలాజీదాసు.

## ప్రకటన.

ఈదిగువ నుదహరించిన గ్రంథములు అనకాపల్లి విశాఖపట్నంజిల్లా బీ. బాలాజీదాసు అందుకో, అని వ్రాసిన వచ్చును.

| | | |
|---|---|---|
| 1 | కుశలవవిజయం | రు. 0-10-0 |
| 2 | గయోపాఖ్యానము | 0-8-0 |
| 3 | ప్రియంవదాచరిత్రము | 0-6-0 |
| 4 | జయప్రద లేక పురూరవ | 0-8-0 |
| 5 | త్రిశంకువిజయము లేక హరిశ్చంద్ర | 0-8-0 |
| 6 | నలచరిత్ర | 0-8-0 |
| 7 | సీతాకళ్యాణము | 0-8-0 |
| 8 | రుక్మాంగద లేక యేకాదశీమాహాత్మ్యము | 0-8-0 |
| 9 | ద్రౌపదీమానసంరక్షణము | 0-6-0 |
| 10 | దయాకరవిజయము | 0-8-0 |
| 11 | సూరదాసుచరిత్రము | 0-6-0 |
| 12 | పురందరదానుచరిత్రము | 0-6-0 |
| 13 | కర్ణానందదాయిని (పద్యములు) | 0-6-0 |
| 14 | హరికథేతిహాసమంజరి. మొదటిభాగం (పద్యములు) | 0-6-0 |
| 15 | డిటో 2వ భాగం (కీర్తనలు) | 0-6-0 |
| 16 | కుచేలోపాఖ్యానము | 0-6-0 |
| 17 | రామదాసుచరిత్ర. చల్లారామలింగయ్యగారి విరచితము | 0-6-0 |
| 18 | యామునాచార్యచరిత్ర. సోంత్యాన అబ్బాయిగారివిరచితము | 0-6-0 |
| 19 | భామినీ విలాసము (పద్యములు) బులుసు పాపయ్యశాస్త్రి | 0-4-0 |
| 20 | వసంతయామినీస్వప్నము (నాటకము) డిటో | 0-12-0 |
| 21 | శశిరేఖా పరిణయము | 0-8-0 |



శ్రీ

# హరికథేతిహాసమంజరి.

## కీర్తనలు.

---

బాలాజీదాసు విరచితము.




---

### 2. హిం॥ భైరవి—ఆదితాళము.

1 ఇంతనే వేడుకుంటి, తమ్మికంటి, దీనుఁడంటి, మొరవినుమంటి॥ నిం॥

2 కంతుజనక, స్వాంతమునస్మ । రింతునన యము పంతమేల సంతరించ
మంతనమురా, దుగ, నగ, పగ, తుగ జరాజునుగా, రవమునగా, చితి
వనిగ ॥ యిం ॥

3 సకల చరాచరవాస ! సన్నుతవర దివిజేశ !
ప్రకటితమందహాస భక్తజనాధినివాస
రవిభాస జగదీశా ! భవనాశ ॥ యింత ॥

4 హరవిధిపురందర స్మరవృకో । దర నరద్యోమా । తురనుత చక్ర
ధరాధరాధరధరాధరధర । విజితాసుర త్రిజగద్భాసురభజిత భాసు
ర బాలాజీ దాసార్చితచరణా భవతరణా శ్రితభరణా మితకరుణ ॥
యింత ॥

### 2. హిం॥ భైరవి - ఆది.

1 గాలీ ! నీవు లాబోకుమ మాజోలి చలి॥ గాలి॥

2 వాలాయముగవినుటకువచ్చిరి తాళమృదంగాదులతోడను, బీ. బా
లాజీదాసుఁడుసెప్పెడి, హరిసుద్దులు ప్రబుద్ధులుగలపెద్దలు ॥ గాలి॥
3 హాటకాంబరుని మేటికథవినక । ధాటిగమన్మథకూటాసక్తిని
బోటులకౌఁగిటసూటిగజేరెడి నీటుగాండ్రున్నచోటికిబోచలి॥ గాలి॥

## 3. సువ్విపాట.

1 సువ్విరార సుందరాంగ సువ్విధీర సుగుణసాంద్ర
సువ్విసీతారామచంద్ర సువ్విలాలీ॥ సువ్వి॥
2 సంసారమనునట్టి సాగరంబులోనబెట్టి
హింసబెట్ట తగదునీకు కంసమర్దనా॥ సువ్వి॥
3 ఆసించియున్నాను వాసుదేవా ! బాలాజీ
దాసపోష దోషనాశ దశవేషా॥ సువ్వి॥

## 4. దంపుళ్ళపాట.

1 హులుం, హులుం, హులుం, హులుం, హులుం, హులుం.
2 వల్లభుడిలుసొచ్చి వేడి । నీళ్ళుబెట్టు లచ్చీ యన
నీళ్ళకేమి ముందునా । కాళ్ళుబట్టుమందు॥ హులుం॥
3 అత్తనన్ను దిట్టినట్టు । పైన బీటబట్టి
నెత్తిమీఁద గొడుదు వట్టి । నిందలుపైబెడుదు హులుం॥
ధివచ్చి భిక్షమిమ్మనియడిగినఁ దత్క్షణ
ని వెంటదరుముదు ర ! క్షిత బాలాజీ ! స్థిరము॥ హులుం॥

## 5. నాటకురంజి.

గతివచ్చెనే దమ్మిడి ని । న్నెట్లువిడిచియుందునే దమ్మిడి॥ ఎం॥
వేగతిదమ్మిడి ని। న్నెన్నదరమేమానవులకుదమ్మిడి॥ ఎం॥
మీఁదవేసి । సంతలంటదిరిగి మంచి
ంచితి దమ్మిడీ ఆహా ! యెం॥

4 హెచ్చుపడిని పుచ్చుకొని।పిచ్చసేరుగిద్దలతో
నిచ్చి నిన్నుగొంటినే దమ్మిడి అయ్యో॥ యెంత॥
5 వన్నె కాంద్రము వచ్చిమంచి। హొన్నునడుగ తప్పుత్రాసు
బన్ని నిన్ను గొంటినే దమ్మిడి ఆహా॥ యెం॥
6 వాసివిహార బాలాజీ। దాసులైన నీమీద
నాసవిడువ లేరుగదా దమ్మిడి యయ్యో॥ యెం॥

## 6. లక్ష్మి, గౌరి సంవాదము.

### భైరవి-రూపకము.

ల-భిక్షుకుడెటకునరుదెంచెనో। తత్క్షణంబుదెల్పు శాంభవీ!
గౌ-అక్షయపాత్రజేతబూని శ్రీబలి। యాగస్థలికిని వైష్ణవీ!
ల-నటుడెచ్చటికినరుదెంచెనో - చటుకునదెల్పు శాంభవీ!
గౌ- తటుకున నతడేగెను శ్రీబృం। దావనమునకు వైష్ణవీ!
ల-ఇచ్చటవృద్ధ వృషభముండవలె - నెచ్చటికేగెనెశాంభవీ!
గౌ-పచ్చికమేపింప దోకొనిచనె గో-పాలుడు దానిని వైష్ణవీ!
ల-లేడిపిల్ల యిచ్చటనుండవలె! లేనిహేతువేమె శాంభవీ!
గౌ-లేడిని నేనెఱుగ పందిని నేనెఱుగ। పోడిమిగావినుు వైష్ణవీ!
ల-తనరగ బాలాజీదాసునేలిన నీ। ధవుడెంతగడసరి శాంభవీ!
గౌ-అనియనిపించుకొనుటలత్తా। నీస్వభావమనుమాటవినలేదా వైష్ణవీ॥

## 7. చంపకార్థము- ఆది.

1 నయమున చిన్నప్రాయమున నల్లనిచీమలుప్రాకుచుండగా
భయమునజూచి బూచియని పల్కుచుబల్కుచు రానురానుయీ
వయసు వసంతకాలగతి వర్ధిల్లగను జ్ఞానకుజాతమును॥ వర్థి॥
2 ఆశయ నెడిచీడపురుగుదాని। నాశ్రయించి కలచును తుదవిఱచును

3 కనుక బాలాజీదాసుని బ్రోచిన గరుడగమనుదలచుచున్ సత్యాశ
మనమున నెంచని మనుజుఁడు త్వరితగ । తినిపరసౌఖ్యమందు ॥వ॥

## 8. గడుసు పెండ్లము.

ఝంఝూటి—ఆదితాళము.

నీకేల యీగండుతనము, మగడ॥ నీకే॥
టీకు, టాకు, జూపిన । నాకేమిఘనము ॥ నీకే॥
పున్నమ్మగారి యాచిన్నసూరిమగఁడు
పున్నయ్యయెంతో మంచివాడు, దాని
పున్నెముకొద్ది దొరికినాడు, నగ
లెన్నెన్నొ చేయించినాడు, ఊర
కున్నదానేవండుతాడు, దాని
కన్నముబెట్టుతాడు । తిన్నాకుదీసుతాడు ॥ నీకే॥
తెల్లవారగలేచి యిల్లుగుమ్మములూడ్చి
కల్లాపుతాజల్లుతాడు, ముగ్గు
లెల్లతానేబెట్టుతాడు, పెరుగు
చల్లపాలుదెచ్చుతాడు, కడవ
నీళ్ళుకాచియిచ్చుతాడు, దాని
యొల్లెల్లబట్టుతాడు । పిల్లలనుదీసుతాడు॥ నీకే॥

## 9 అమాయకపుభర్త

ఏలోపముజేసినానె, నీ కేలో॥
బాలా! నిందించుటమేలా గుణశీల॥ ఏలో॥
వీరాగాళ్ళపైవెన్నమెత్తి మెల్లగారాచి
బాగమెటికెలువిరువలేదా? నీ
సొగకురులుదువ్వలేదా? పంకా

లాగి నిద్దురబుచ్చ లేదా? యను
రాగమ్ముననుండ లేదా ? నీ
వాగుమన్న చోట నాగుచుంటిగద ॥ యేలో॥
కాఫినీళ్లుగాచి తీపిహల్వా జేసి
నీపొట్టనింపుట లేదా ? నిన్న
తోపుచీరకొన లేదా? నగల
రేపు నేఘర్మాయించెద నాపై
గోపించుటిదిమర్యాద యోసి
నీపుణ్యముంటుంది నాపరువుడీయకె ॥ యేలో



కోడి పాట.

## 10. ఝుంఝూటి—ఆదితాళము.

కోడి నాకోడి నీ । వేడకేగితివో ముద్దు ॥ కోడి ॥
పాడుపందెముగట్టి యల । వానిపొట్టజెట్టితి ॥ కోడి ॥
నూజివీడునుంచి, బల్ మోజుతో గ్రహించి
రోజుతవుడుదినిపించి । గాజుకాయవలెబెంచి, తి ॥ కోడి ॥
అందమైన యారె, నీ । క్రిందిచూపుతీరే
మందు పరువుబోయె, వరి। పంధికిజయమాయె ॥ కోడి ॥
వందలాదినిచ్చి, ని । న్నిందుగొనితెచ్చి, తి
పందెగాళ్లుమెచ్చి, పైపందెమిడినొచ్చి, రి ॥ కోడి ॥
బొడ్డుముల్లెలాగి, మంచి । బుద్ధిసారాత్రాగి, హై
రోడ్డుమీదజోగి, పోలీస్ । దుడ్డుపోటుకాగి, తి ॥ కోడి ॥

## 11. నాదనామక్రియ—ఆదితాళము.

అస్సు - అస్సు
కరకంచు చీరమేన । గట్టితే చిన్నదాన
గరితమిన్నలలోన । నెరసీటుగనుందువు చాన అస్సు ॥

నారీ పదునారుమూర । నల్లబొత్తంచుచీర
కీరవాణి యిచ్చెద । కృపనింపుమా నామీఁద ॥ అస్సు ॥

## 1. పీల్వా—త్ర్యశ్రగతి.

1 ఓడవెళ్ళిపోవుచున్నది సామి ! ॥ యో॥

2 త్రాడుబట్టి లాగకుండ । నేడుగాలి చాపత్రోడ ॥ నో ॥

3 మచ్చికతో మున్నీటను । జొచ్చినాల్గు పొత్తమ్ముల
దెచ్చి బాపనయ్య । కిచ్చినట్టి లచ్చిదొరా ! ॥ యో॥

4 వేలుపులు రక్కసులు । పాలకడలిలో గొండ
నోలిదఱువ క్రిందదా । బేలయ్యున్న తండ్రి ॥ యో॥

5 పందరక్కసుండు నేల । నందిచాప జుట్టనడవి
పంది వాలకమున వాని । బొందె జీల్చినట్టి సామి ॥ యో॥

6 తడయక గొడుకునకు దుడుకు । లిడెడి నల్ల గుడుచువాని
జడలమెకంబై గోటనె గడ । తేర్చిన నాతండ్రి ॥ యో॥

7 మట్టిని మూడడుగు లిచ్చి । నట్టివాని నెత్తినడుగు
బెట్టినేల క్రిందకడచి । నట్టి పొట్టి బాపనయ్య ॥ యో॥

8 బంటులైన రాచవారి । నొంటిగెడపి వారితలలు
మంటికి మింటికి మెట్లుగ । నంటించిన నాతండ్రి ॥ యో॥

9 రాచరచ్చ నడుమజొచ్చి । బూచులదొర వింటినెత్తి
రాచచిన్న దాని కేలు । జూచిపట్టి నట్టిసామి ॥ యో॥

10 గొల్లవారి యిండ్లలోని । చల్లపాలు ద్రావియాడు
పిల్లలదరి జేరివారి । కల్లరలిడు నల్లనయ్య ॥ యో॥

11 పన్నుగనీ నేలమీద । నున్నవారి మంచిచెడ్డ
లన్నియు గన్నులజూచుచు । మిన్నకున్న మొండిదొర ॥ యో

12 నత్తెమువిడనాడి సొత్తు । గుత్తమ్ముగ గూర్పరాచ
మొత్తము నొత్తుట కొఱకై । తత్తడికా నున్నతండ్రి ! ॥ యో॥

## రెయిలు పాట.

### 13. హిం. తోడి—మిశ్రగతి.

1 బండిరా రెయిలు బండిరా సామి ॥బండి॥

2 బండిరాఁ వజ్రచక్రములతో । నుండురా, యిరుతట్ల దివ్వెలు
రెండురా, నడనెత్తి వెలుగొక । టుండు నాపోజ్యోతిరీతిగ ॥బం॥

3 ఒక్క అఱలో చల్లనీళ్ళుండుఁ నరసిచూడగ మఱి
యొక్క అఱలో వేడినీళ్లుండు, తన్మధ్య ననలుడు
దుక్కగమితో బొగ్గుతోనుండు, నడనెత్తి పైపొగ
మిక్కుటంబుగ బైకెగయుచుండు
పక్కపక్కలకు బోకుండ । నక్కడక్కడ నీరుద్రావుచు
నొక్కపూటకు నూరుకోసులు । పక్కివలె పరుగిడుచునుండు॥బండి॥

4 రొక్కమిడి టిక్కట్లు గొనకుండ, నెవ్వారినైన
నెక్కనీయరు వారుగనకుండ, యెక్కిననే వారిని
చెక్కజేసి పైకమును బిండ, దీసికొని వారు
బుక్కులో జూపింత్రు విడకుండ, నెవరైననీయక
చిక్కబెట్టిన నట్టివారి ♦ నెక్కడికి బోనీయకుండ
నక్కడే పోలీసువారికి ♦ నప్పగింతురు తక్షణంబు ॥బండి॥

### 14. కమాచి—రూపకము.

1 Dear come near kindly see me little cool me
my " Dear"

2 Hear I don't hurt you on any occasion
Yet alo! why are you going in passion? "Dear"

3 I shall not forget you my lovely dear how often I told
you my lady. Yet alo! how is that you seem to be sad
and sorry, you have not ornamented your body. Your
heart and my heart should not at all vary, then what

for passion is growing so weary, why do you steal my mind and carry? who have given you the grounds to be sorry? "Dear."

**A. V. Narayana Rao, B. A., Coconada.**

### 15. కమాంచి — ఆదితాళము.

1 Omnipotent and the omniscient and the
Omnipresent Him we always should obey "The one"
2 Honorable Creator assembled we should adore
Him God evading even high minds prevading
"The one"
3 His one career there is none say here sure
Whole of His history "is full of much mystery"The one"
4 Full loved by us children be loved to His well drawn
forgives and paternally gives bliss eternal "The one"

శిష్యురాలితో గూడ నెంచిన గురువు యెలుగుబంటిచే దెబ్బలుతినుచు

### 16. కళ్యాణి - ఆదితాళము.

బ్రా—తలుపు వేగతీయుమా ముసలమ్మ అయ్యో ||త||
పొలతిమిన్నగాదు పెద్ద। యెలుగుబంటి జుమ్మా ||తలు||
ము—సంగనాచి వంగముల్లు లేవయ్యా ||సంగ||
అంగనామణితో స। య్యాటలాడి రావయ్యా ||సంగ||
బ్రా—అబ్బదీని గోరులెంత పెద్దవి
గొబ్బున నదిగొట్టమేన గ్రుచ్చుకొనుచున్నవి ||తలు||
ము—ఇంత కల్లలాడ మీకు చెల్లునా
చింతపిక్కవంటి రాచ। చిన్నదాని చెంతనుండి ||యిం||
బ్రా—దండమిడెద వేగ రమ్మా ముసలమ్మ
కండలూడదీసి ప్రాణము కబళించుచున్నది ||తలు||
ము—దండమిడెదననుట మీకు న్యాయమా
దొండపండువంటి తనయుండుగల్గు నమ్మ రమ్మ ||సంగ||

చాటు.

17. ఝుంఝూటి—ఆదితాళము.

అయ్యాకోయ్యోడవో రయ్యా॥
తొయ్యలిపరాయిదిగాదు । తోబుట్టువుకూతుర్రో॥ అ॥
ఇసుగుపొరుగువారిమాట । లెన్నడుచెవినిబెట్టకురో॥ అ॥
ఈసుజోసుగలదని । యింతదూరము జెప్పితిరో॥ అ॥
చిట్టెమ్మెక్కిన రబ్బరుబండి । సీలజారిపోయింది॥ అ॥
చీలజారిపోయినగాని । బాలకుఫర్వాలేదురో॥ అ॥
కురుచమొక్కలపీటవంటి । కుందనాయుడుకూతుర్రో అ॥
ఇటుంచినలువది యటుంచినలువది । యెనుబదిరూకలుపోయినగాని
యిల్లునిండిన పెళ్ళంరో॥ అయ్యా॥

పాపట్ల కాంతయ్యగారు.

18. పీల్వా—ఆదితాళము,

1 ఎంతమోహమ్గే నీకి సెయ్యోత్తి మొక్కాల కనకాంగీ!॥ యెం॥
2 ఇంతఫికర్ లేకమాకి గొంతుకోసినావుగే కనకాంగీ ।॥ యెం॥
3 మాకివుంచిందిరాణిపారా । మామీద బెడితివి తమ్మనికిపార
రాణికంటె నీవేమెక్వ నీకిమొక్కాల కనకాంగీ॥ యెం॥
4 ప్రేమల్కిసూపించి ముద్దుల్కితినిపించి
పిస్తోల్కిసూపించి పోయిందిప్యారి
నమ్మఖరాంలో భోగవోల్కి నమ్మకూడ్దండి, యాక్ థు॥ యెం॥
5 ఆన్కినీమీద తల్గిందిశానా । ఆన్కినాకిభి చేసినావుదివాన
కోన్కితయ్యార్ జేసిసీకి లోన్కిపోయినావుగే కనకాంగీ॥ యెం॥

19. గజల్—రూపకము.

1 ఆషక్కు, ఛోడ్కె కాబెకు, జానేసె, కుచ్, నహి
యహా, పర్, మేరియార్ కు, కాబా బనాయింగె॥ ఆషక్॥
2 బయితుల్, సనమ్కు ఛోఢకె, క్యా, కాబ, జాయింగీ
వహాబి, వైహి, సనమ్ హుయితో,ము, క్యా, దిఖాయింగె॥ఆషక్॥

3 జోషే, దినోమె, హామ్, కబి, అపనేజో, ఆయింగె
మజనూ, బనింగె, హం, తుజె, లయిలీ, బనాయింగె॥ ఆమక్॥
4 వోరిష్కె, గుల్‌జో, బాగమె, తమరీప్, లాయింగె,
బుల్‌బుల్, కరింగె, షౌరతు, గుల్‌ఖార్, బనాయింగె॥ ఆమక్॥

## 20. బేహాగ్—ఆది.

1 క్యాబోలుమ్, సఖీకా, కుప్సూరత్, మై॥ క్యా॥
2 పూరవ, పశ్చిమ, వుత్తర, దక్షిన, డిల్లి, షహార్, ఫిర్కె, దేఖా,
హు, మై॥ క్యా॥
3 రంభా, యూర్వసి, రామ్కాసతీ, రతి, యేరామాకుసమానన హీ॥
4 బనపంకజతోయ తటాకగిరే । సారంగఅరణ్య అరణ్యఫిరే
మృగరాజగిరీకుహారే విహారే ! గజరాజదశోదిశవాసకరే
ముఖలోచన, లంక, పయోధర । ప్యారికెదేఖీసబీసునమాహిడరె
బినమానజుపానిపయానకరె । అథవాకహె దూరహిజాయపరె॥

### వేసవి వర్ణనము.

## 21 హిం. భైరవి—త్ర్యశ్రగతి.

1 చెలరేగకేయుక్క నీ । తలబట్టి చలినొక్క
తలపకుమాచిట్టి నిను । దరుము విసరుకట్టి॥
2 అనుసరించకెనల్లి నిన్నట్టెమింగు బల్లి
ననుదాఁకకేయాగ నిను । బనసజిగటలాగ ॥
3 పగబూనకేచీమ నిన్ను । బట్టి నేలపాము
పొగరెందుకే దోమ నిను । బొగజంపును జమ॥
4 ఎగరకుమాధూళి యి । ల్లిదిగోవర్షాళి
మొగరకె మొంగిలాక ని । న్నెందుకుకప్పీక ॥

## 22. పీల్వా—రూపకము.

1 ఎందుకురాపెళ్ళి యెందుకురా! ॥ యెం ॥
2 అందగత్తెగ । య్యాళి పెండ్లమయిన
అద్దాని మూరెట్టి । పెద్దమగండయిన ॥ నెం ॥

3 నీరసించి లేవ । నేరకశంకించి
కోరచూపులుజూచి । గ్రుక్కిళ్ళు మ్రింగుటల ॥ కెం ॥
4 వండితిననిబిల్వ । నుండ నలుపుతావు
పిండము దింటావు । పండుకొని లేవలే ॥ వెం ॥
5 పుట్టతల ముగ్గు । బుట్టవలె నెరసి
నట్టేట నున్నట్టి । నావ వంటివాని ॥ కెంద ॥



## 23. సావేరి—ఆది.

1 చెల్లెలబో చిన్నతనముననున్న యల్పసంతుష్టి ॥ చె ॥
3 గుల్లలు మూటలుముల్లెలు పర । వళ్ళు వెన్నెలమళ్ళు
నవ్వునోళ్ళు చిప్పచిప్పగోళ్ళు బొమ్మ । రిళ్ళుగుజ్జనగూళ్ళాట ॥ చెల్లె ॥

## 24. పీల్వా—ఆది.

1 భామామణులపొందు గుణ । ధాములుగనరెందు ధన ॥
2 పామరులకువిందు । పరమార్థమునకు బందు ధన॥ భా॥
3 అంగిటనమృతంబు మఱి । నాత్మలోవిషంబు వా
రాంగనసంగంబు మోక్షార్థికిభంగంబు ॥ భా॥
5 మొగముజూడనింపు దాని । మూతివిప్పినకంపు
ముసుగులోనసొంపు దాని । ముట్టిన మఱిచంపు॥ భా॥

## 15. బిళహరి—ఆదితాళము.

1 తెగనీల్గకెపొగచుట్ట నీ । సొగస్ల్ల తగలబెట్ట ॥ తెగ ॥
2 తగనికంపు ఛీపొమ్మని మగలను । మగువలచేదిట్టించెదవింక ॥ తెగ॥
3 వినవే డబ్బెక్కువవ్రయమాట । విబుధాళిలలోపల వెలియాట
యెనుబదిసారులు దాహంబాట । యెట్టనిపెదవులు మసిబొగ్గాట
ఘనులసభాస్థలి నపూజ్యమాట । కట్టుబట్టలెల్లదగ్ధమాట
తినునప్పుడరుచిగల్గి నుమియుట । దీనజనులైనన దేవిరించుట
ఘనుడగుశ్రీనందివాడ జ । గన్నాథరావునేలిన శ్రీహరి
గుణకథనంబాలకింపవచ్చిన । కోవిదులిటనుండిరి ఛీఛీపో॥ తెగ॥

26. చాటుధార - ధన్యాశి - ఆదితాళము

1 పోయ్యేటప్పుడు వెంటను రాదోక । పుచ్చినవక్కైన॥ పో॥
2 వెయ్యారులు దాచుకొనెదరర్థుల । కియ్యని లోభులకునయ్యయ్యో
3 ఇచ్చినమాత్రంబున దైవంబిడు । హెచ్చడిగిన రాదు
వచ్చినపుడు మనవెంట నేమయిన । దెచ్చుకొనుట లేదు
ఇచ్చట నార్జించిన ధనమెచ్చటి । కెత్తుకపోయెదరయ్యయ్యో॥ పో॥
4 తనురక్షణకై మూలమూలలను । ధనమును దాచెదరు
తనయులు దారాదులు స్థిరమని డెం । దమ్మునదలచెదరు
తనవారెక్కడ తానెక్కడ యీ । తనువు నెడబాసి జీవుడు వంటరిగ॥

27. తోడి - త్రిపుట.

ఇందుకా పంచాంగము చెప్పిన । దిన్నాళ్ళనుసరించి॥ యిం॥
2 కందువలాడేది కడకు దెలిసితె । కాశికిబోయివత్తుగ దెలిర్దయు రాల॥
3 ఎద్దుతాకట్టుబెట్టిముద్దెటెంటికి నిలువు
టద్దము తెచ్చినది పెద్దలబుణమటె
కద్దటె నీ—కంచిగరుడసేవ
ముద్దుబెట్టమంటె—పుడుచుకొనియెద॥ ఇందు॥
5 వరలక్ష్మివ్రతమన్న । నొకయిల్లు తెగనమ్మి
యిరుచెల్వొరుగకుండ । నిచ్చిన తులకలేద
గురు—మీద । గోరులుంచెదనన్న
తిరిగిచూచిచేయి । మరుగుజేసికొనియెద॥ ఇం॥

మ. ఆ. నారాయణదాస విరచితము, విజయనగరం.

26. నానక్—నాదనామక్రియా—చతురశ్రగతి.

1 శ్రీకృష్ణునినామామృతపానము । జేసి బ్రతుకుడన్న భక్తిని
జేకొనిమనుడన్న, ముక్తిని । గైకొననగునన్న, యీ
లోకమందతని గొల్చినవారికి । శోకములేదన్న,
యిహాపరలోకసౌఖ్యమన్న । విన్న॥ శ్రీ॥

2 అన్నలార ! హరి దేవకికడుపున జన్నికొమరుడైబుట్టి దా
నున్నచోటువెడబెట్టి నందుని । చిన్ని పెంపకపుపట్టి రక్కసి
చన్నుగుడిచి జమునింటికులాముగ 
మున్నెయంపకముబెట్టిముద్దుల । మూటగట్టితొల్దొట్టియట్టి॥ శ్రీ॥
3 బొమ్మదేవరను బుట్టించినతన । బొడ్డుతమ్మికొకగుడ్డుయడ్డుగ
గ్రమ్మగపొత్తిట బిడ్డడైతన । యమ్మకునయ్యకు దొడ్డసంతస
మమ్మడిగాని త్రెమ్మను నల్పుచు । నూసులుసెప్పదొడంగెఁబిలిచిన
నెమ్మినిజూడగడంగెఁ ఛీఛీ । పొమ్మన నవ్వుచునుండెఁ యశో
దమ్మకు భాగ్యముపండెఁ దానుండఁ॥ శ్రీ॥
4 మొలకనగవుతో ముద్దుమొగముతో
తలిరుమోవి కెంజిగితో నొసటను
వెలయుకురులు నిగనిగతో బుగ్గను
చెలగుచుక్క ధగధగతో యడుగుల
తలిరులందు తేనియగాగంగను । దాల్చుతండ్రి తనయమ్మ పుడిసెడు
జలమును తనపై జిమ్మస్నానము । నలిపినాడు వేగమ్మయట్టి॥ శ్రీ
5 ధరణికి నభయంబిచ్చుతెఱంగున । దాబోరిగిలంజొచ్చెఁ శకటా
సురుని జముపురికిఁబుచ్చెఁ దేవని।కరమయ్యాదిగని మెచ్చెఁనందుని
గరితయులరి చన్నిచ్చెఁ దన్నుఁ
బరమునకుంగొనిపోవనాతృణా । సురునిజంపి దిగివచ్చెఁ నానా
టరహి బెఱుగుచున్వచ్చెఁగనుసం।దకినదృతము హెచ్చెఁ బుచ్చి ॥
6 అందముగాబంగారుతాయితులు । సందిటపైగనుపింపశిరము
నందు తురాయిచలింప నాసిక । యందు బులాకినటింప యడుగుల
నందెలు ఘల్ రవణింపయురము
నందలపులిగోరులపతకముదెస । లందున నిగనిగనింపదేవుని
నందనునిగభావింప తల్లికి । ముంగటినోముఫలింప మన
మందరము దరియింప నడిచిన॥ శ్రీ॥
7 జీవులకందరికన్నముబెట్టిన । దేవుండన్నము ముట్టని
ల్లావలకుం బరువెట్టె ననుఁ।రావళివేఁబడగొట్టెఁ పిల్లన

క్రోవినితనచేబట్టె న
న్నా వద్దుర మన్నేల దినెదవన । నమ్మకుమోముమన నట్టె లో
కావళులంజూపెట్టె నాగడ । మీవరుసనుసమకట్టె మన
దేవుండిటుల గన్పట్టెనట్టి॥ శ్రీ॥

బాలాజీదాస విరచితము.

# కపోతవాక్యములు.

ఉ. గువ్వలు రెండు కూంతునకు గొబ్బున బెండిలిసేయనెంచి బల్
యావన రూపధైర్య వినయంబులుగల్గు కపోతపోతము
న్దవ్వులనుండి దోకొని ముదంబున యత్నముం జేయుచుండంగా
చివ్వన వేటకాండలుగుచే మగపక్షిని ద్రుంచ నత్తఱిన్.

బలహంసరాగము - త్రిశ్రలఘువు

1 అయ్యయ్యో నాకెట్లుజతగూడు, నాసగొన్న వాడు
చయ్యననాకిటులపద్మా, సనుండు వ్రాసినాడు॥ అ॥

2 యేపుమీర వేటకాండు, యిచ్చటికరుదెంచెనా
పాపమనుచు నెంచకనీ, ప్రాణములుద్రుంచెనా॥ అ॥

3 ధవుండు లేని విభవమేల, తనువదేలముందు
పవనసఖునితోడ గలిసి, పరమునుం గనుగొందు॥ అ॥

4 అని॥ కృపీటయోనిని యిం,ధనములందు బెట్టి
వినయంబున ఱెక్కలచే, వీచుచుండ నట్టి॥ అ॥

5 తఱి తలిదండ్రులును, రాగం, దద్విధంబు దెల్పి॥
పరిపాలిత బాలాజీ, పయి హృదయముద్విల్పి॥ అ॥

వ. యుండనంత తల్లి కూంతుంజూచి.

ఉ. అమ్మక చెల్ల నీతనువు నగ్నికిదత్తముం జేయ నేల సూ
త్రమ్ముప్రియుండు నీదగుగళంబునగట్టమి దప్పు లేదు రా
రమ్మిక రూపయవ్వన విలాసముగల్గిన వానిదెచ్చి నీ
కిమ్ముగ బెండ్లిఁజేతునని యిచ్ఛకమాడిన దానిజూచితాన్.

## కమాచిరాగం-ఆదితాళము

నాతిరో నీవీతీరునబల్కనీతియె వో॥ నా॥

2 మాతరో విధాతవ్రాయు వ్రాత కేమందు గుణవ్రాత॥ నా॥
3 ఎప్పుడై! తె నాహృదయము తనయం దొప్పినదో యప్పుడెవా
నికినే దప్పక సతినై తిన్ని సుగుణాలకుప్ప, ఇదిటప్పాగాదప్పా॥ నా॥
4 తనువశాశ్వితము గావున బాలాజిని బ్రోచిన పరమేశుని సత్కృప
గనుట జన్మసాఫల్యము కపోతకిశోరమా, ధృత యశోరమా॥
యో ॥నా॥

క. అని తెల్పియాకపోతము
సనలములోనురికి మోక్షమందెనుగాన
న్వనితలు భర్తను దైవము
గనుదలంచి నటింపఁ బరము గందురు జగతిన్.

వ. రెండు గువ్వలు పిల్లల మేతకై వచ్చి వేఱొకచెట్టున గూర్చుని యుండ నంత వానిఁ జంపనెంచి వ్యాధుండు క్రిందబాణము గురి జూచుచున్నంత పయిని డేగయాడ నంత నాడుగువ్వ మగగువ్వం జూచి,

ఉ. అక్కట డేగ మింటిపై నాడుచునున్నది క్రిందఁజూడఁగాఁ
బక్కన వేటకాఁడు తన బాణముచే గురిఁజూచుచుండెనో
చక్కనివల్లభా! మనకు చాలప్రమాదము వచ్చె నయ్యయో
రెక్కలురావుపిల్లలకు రేపటినుండియు మేఁతలేమిచేఁ
బొక్కుచుగూఁటిలో నగసిపోవఁగ నేరవు తల్లిమేఁతనే
దిక్కనదెచ్చునోయనుచు దీనతఁజూచుచునుండు నిప్పుడే
ప్రక్కనుబోదమన్నను యుపాయముదోఁచదనంగ గ్రక్కున
న్మక్కువపక్షి దానిఁగని మాధురివాక్తతితోడ నిట్లనున్

## మాయామాళవగౌళ - రూపకం

అందకాడబంగారుమామ యను వర్ణమెట్టు.

కందువులకు మేతలేదని డెందమున గుందుటేల
నందరికాధారుఁడయినట్టి యో యిందువదన కుందరదన
మందరాద్రి ధరుండుండఁగ॥ కం ॥

2 పుట్టినజీవరాసులెల్ల । గిట్టునని కోవిదులు
గట్టిగ బల్కిన వినలేదా, యో । చిట్టిపిల్ల, పట్టికల్ల
లట్టిదానికి నాశ లేలనే॥ కం॥

3 యీపుడమిలో బాలాజి । నేపుమీరఁ బ్రోచినట్టి
శ్రీపతి మనపాలనుండిన, నో। కాపరి, కడుచూపరీ,యీ
యాపదలెన్నైన నడుగునె ॥కందువులకు॥

వ. అని యిటుల నాడగువ్వతో దెల్ప నంత సంతసించి భగవంతుని గూర్చి,

## హిందూస్తానిభైరవి—ఆదితాళము.

దేవరా కావరారా ॥దేవ॥
2 స్థావరజంగమాదులకు గతినీవేరా సుస్వభావరారా॥ దేవ॥
3 శ్రీవరా, నీసేవసద్గతికి । త్రోవరా, విపదాంబురాసికి
నావరా, పాపాంధమునకు మెఱపు । తీవరా, నతసుధీవరా, రా॥ దే॥
4 పీవర, గ్రాహంబునరిచే । గావర, మడంచి కరిని
తీవరా, నన్నేలిన ధా । త్రీవరా, నాక్రేవరారా॥ దేవ॥
5 యీవరా, వనిలోన బాలా । జీవరాశి నిచ్చినట్టి
శ్రీవరా, హరిరూపార్చితనగ । జావరపదరాజీవరారా॥ దే॥
వ. అని యిటుల,

ముఖారి—త్ర్యశ్రలఘువు.

పరమేశుని గువ్వలు గడు ప్రార్థన జేయు । సర్పము వ్యాధునిడాయ
నంబరమున నాడెడు డేగకు బాణముడాయ । దండ । ధనునినిశా
యమునకు డేగనడిచె, ప్రాణ । ములు వ్యాధుకువిడచె । నాపద
గువ్వలుగడిచె॥ తకిట, తధిగిణ, తధిగిణత, తధిగిణత॥ పర॥

గీ. కాన దైవంబుపై భక్తిగలిగినట్టి
వారి కేవిపత్తులురావు వచ్చెనేని
యరఘుషీయలో దొలఁగు సందియంబులేదు
తలఁపగా పఱుకథయే యుదాహరణము॥

బో. సుదర్శనదాస విరచితము.

## ఆంజనేయస్తుతి.

రాగము—కాంభోజి—ఆదితాళము.

1 నన్నునింక శోధించుటధర్మమా -నాదుపూర్వకర్మమా॥ హనుమా॥
2 పన్నగమీపదపద్మయుగళము- భక్తిబూజించియు బహుదినములు
గను - నన్నుజెందిన వ్యసనముబాపి కృపతోడ - నలువుగ మీను
దర్శనమునిచ్చికాపాడకున్న నీకన్న -నాకున్నవరయ్యీభూమి -

లోకులదిక్కా—

పన్నశరణ్యప్రసన్నముగావిదియేమి- నేజేయుతప్పు
లన్నికెన్నక గ్రన్నననేలుమిసామి- భక్తవత్సల -
తన్నాదువిన్నపమున్నాలకింపుజితకామి - సహస్రకిరణ-
తపనతనయప్రియ సఖరిపుమదనా-అపరిమితసుగుణమణిగణసదనా-
దనుజవంశ - మదవిధ్వంస - దినకర - వినుతధైర్య - బహుళశౌ
ర్య - శుభకర - త్వన్నామసంకీర్తనమెడబాయ - కన్నెనుజేసిన
గాని ఆంజనేయ ॥ నన్నునింక ॥

3 శ్రీరామచంద్రసముదిత సచ్చరితా - చిత్సుఖానందసహితా - శ్రీరామ

4 స్థిరంబుగను దశరథభూపతికిని - ధరణిబుడుతయయి బుట్టినగుణఖని
శ్రీరామ॥

5 సిద్ధసాధ్యప్రముఖ సురావళికిని - శ్రద్ధతోడ నభయమొసగి భువికిని
నేమమొప్ప విచ్చేసిసేవకుల - ప్రేమమీర బ్రోచినట్టి యినకుల
శ్రీరామ॥

6 చిరుతను బనుపుమనుచు గుసికసుతుడు - నరపతి దశరథుని నడుగ
నతడు - చిరతరముగ ననుపగను జనునపుడు - గురుతర విపిన
ములఁ గడచుచును గడు - జేవమీరిఎదిరించిన యాతాటక - జా
వఁగోలఁగూలదన్నిన నిష్కంటక॥ శ్రీరామ

7 చెన్నుమీరఁగౌశికుఁడాచరించు - జన్నమున్హాతంబుసేతమంచు - నె
న్నిదుష్టవృత్తినినేగుదెంచు - నన్నరాంతకావళియొక్క సంచు - క్షీ
ణమానటుల గోదండము నెక్కుబెట్టి - బాణవృష్టిగురిపించి దైత్యు
లనుగొట్టి చెంతనున్న మునిగణములుబాగడ గాధేయు - డంతరం
గమున నుప్పొంగ సవనరక్షణసేయు॥ శ్రీరామ

8 చేరదీసిమాని నాయకుడు నిటు - రారనాకుమార నేడుమిథిలకు -
గోరిపోదమంచు దోడుకొనిచన - దారిలోన రాతిరూపు కనుబడి
తాపసుండు మ గౌతముడన్వర - తాపసుండు కోపముతోనిడు -
శాపదగ్ధమైయున్న యహల్యను - బ్రాపుగా బద రేణువుచేతను -
బడతిజేసి ధవునిజేర్చి ముదమొదవెనంగ - వడిగవచ్చి మిథిలఁజొచ్చి
జనకుడు ననంగదమనుని విలువిరువుమని సభనిడగ - దనకరమున
గొని శశిరవులడరగ - ధరణియెల్ల గిర గిర గిర గిర గిర గిరుమన
దిరుగగాను ఫెళ ఫెళ ఫెళ ఫెళ్ళువి విరచిన - శ్రీరామ

9 మేరుసమాన ధీరవిశ్వాకార - మేదినీపుత్రికా హృదయానందకర
సారరహిత సంసారభారదూర - సజ్జనౌఘ మానసాంబుజాతవి
హార - జానకి జాడను - మానుగ - దెస్సని భానుకు - లేశుడు
వానర - రాజును - సరాళముగ ననుమతి దయసేయగ - బిరానము

ద్రికగొని శాఖామృగ - సంఘమంతయును దక్షిణజలనిధికి - రం గుమీర నుత్తరంబున నిలిపియట - ఘంగునం జలధిబాటి యల లం ఖిణిని - బొంగడంచి లంకాపట్టణము నట్టెజొచ్చిసాహసమున న ప్పట్ణంబెల్లద్రిమ్మరి వై - దేహిగానక నష్టట్టిపడుచును వ్య - సనం బంది మదిగుందుచునొక యశోక - వనంబందు ఘోరరూపులైయు న్న - దైత్యసతులమధ్య నతులబుద్ధి రఘువరుదేవిని - వెతలుదీర హితవుమీర గనుగొని వీరలజంపం - గంబ - క్వంబిది - యనివె స - సరభసముగ నయనయుగమున నింపు - లంపుం - గుంపుల్గ్రి మ్మగ - నురవడిననురసతులు జనకజమదిగలంగ - ద్రుంపుం - డం చుం - దిట్టుచు - నిటుపరి - బరివిధములను భయమునుపరుపంగ గంపిం-చుంభూ-పుత్రిని-గనుగొని-గడురయముగ బహుముదమును జెలంగ - సకలక్షేమ-ములను రామ-పత్నికి - నొకటజెప్పి - ముడి నివిప్పి - ముద్రిక-జాలాప్రేమమెసగ - సీతకుమ్రొక్కి - సంతోష ముననొసగి - యచ్చోటుచాసి విచక్షణుండవై యశోకవనము భం జించి - అక్షయాది దానవవరులనెల్లద్రుంచి - రాక్షసాధిపుడౌ రా వణాసురునిగాంచి - తక్షణంబ రామదూతనేనంచువచించి - చారు లంత నీ-వాలముననగ్ని - జ్వాలనంటింప - గోలాహలముగ - సక లరక్క-సుల నందర జిందరవందర జేసియు - ప్రకటితంబులగు నిం డ్లను బండ్లను విండ్లను గాల్చియు - చారుతరమణిమయా - గార గోపురముల ప్రా-కారములనెల్ల భస్మీకారముగావించి యతి-సంబ ర-మందుచు నంబుధి-దాటివె-సం గపి-పుంగవు-లంగని రాము వ్య- సనమునణచి రఘువరునిదోశౌనివచ్చి - మొనసి దనుజపురమపుడు వేగమజొచ్చి - జననిద్రోహి రావణునిజంపించి మహిమ - బెనగొ నంగ సీతాపతిగూర్చిన హనుమ ॥

## కళ్యాణిరాగం—రూపకము.

1 మోసపొయ్యేవే మనసా ॥ మో॥

2 ఆసతోడ నొక్కపూబోడి । ననుసరించి నశించిరికోటి॥ మో॥

3 సుందరమైనట్టిచాన, దు । ర్గంధముశోధింప లోన, నవ
రంధ్రముగల బాన, నీ । కెందుకీయాసజగాన, మనస॥ మో॥

4 త్రాచుబాముండేటిపుట్ట, దండ । ధరుడు చేబూనిన పట్ట, తాన ॥
లేచి చరించు తోల్కట్ట, ఆత్మ । లేచిపోతే లొడలొట్ట, మనస॥ మో

5 క్రిమిమలములగుంట, కడు । కిల్బిషములుండుపెంట, అతి
కామముపండెడిపంట, అంట । గానె తోడరునుతంట, మనస॥ మో

6 శేయిబవలు నీనోట, నుడువు । రాయపురీశుని పాట, సుబ్బ
రాయుడుచెప్పిన మాట, విని । హాయిగనుండొక్కచోట, మనస ॥

శ్రీ రామచంద్రపరబ్రహ్మణేనమః.



# ప్రకటన.

ఈ దిగువ నుదహరించిన గ్రంథములు అనకాపల్లి విశాఖపట్నంజిల్లా బి. బాలాజీదాసు అండు కో, అని వ్రాసిన వచ్చును.

| | | |
|---|---|---|
| 1 | కుశలవవిజయం | రు. 0-10-0 |
| 2 | గయోపాఖ్యానము | 0-8-0 |
| 3 | ప్రియంవదాచరిత్రము | 0-6-0 |
| 4 | జయప్రద లేక పురూరవ | 0-8-0 |
| 5 | త్రిశంకువిజయము లేక హరిశ్చంద్ర | 0-8-0 |
| 6 | నలచరిత్ర | 0-8-0 |
| 7 | సీతాకళ్యాణము | 0-8-0 |
| 8 | రుక్మాంగద లేక యేకాదశీమాహాత్మ్యము | 0-8-0 |
| 9 | ద్రౌపదీమానసంరక్షణము | 0-6-0 |
| 10 | దయాకరవిజయము | 0-8-0 |
| 11 | సూరదాసుచరిత్రము | 0-6-0 |
| 12 | పురందరదాసుచరిత్రము | 0-6-0 |
| 13 | కర్ణానందదాయిని (పద్యములు) | 0-6-0 |
| 14 | హరికథేతిహాసమంజరి. మొదటిభాగం (పద్యములు) | 0-6-0 |
| 15 | డిటో 2వ భాగం (కీర్తనలు) | 0-6-0 |
| 16 | కుచేలోపాఖ్యానము | 0-6-0 |
| 17 | రామదాసుచరిత్ర. చల్లా రామలింగయ్యగారి విరచితము | 0-6-0 |
| 18 | యామునాచార్యచరిత్ర. సాంఖ్యాన అబ్బాయిగారివిరచితము | 0-6-0 |
| 19 | భామినీ విలాసము (పద్యములు) బులుసు పాపయ్యశాస్త్రి | 0-4-0 |
| 20 | వసంతయామినీస్వప్నము (నాటకము) డిటో | 0-12-0 |
| 21 | శశిరేఖా పరిణయము | 0-8-0 |

